ఉ. కన్నులపండువై నొక యగారములో రతనాలమేడ యో
రన్నను గెంపుటందు నెలతాల మెఱుంగుటరుంగుమీఁదఁ దా
నన్నలకూబరుండును మనోహరలీలల నెత్త మాడితే
పన్నిదమంచుఁబంతములువల్కుచునుండెనురంభఁ జూచుచున్.

గీ. నిండుకొలువుండి యమరవిభుండు నిన్నుఁ
బిలిచి తెమ్మనె రమ్మని పలుక రంభ
రమణునకై దండకొని యొయారంబుమీఱ
జగతి వేల్పడిగై సేసి సఖులుగొలువ.

సీ. నునుము త్తియపుతీవ పనికుట్టు కనకట్టు
పట్టుచనకట్టు సంభ్రమముఁ జూప
నిండు చందురుకావి నెరికెచే రంగారు
కడవన్నె బంగారు కాసెయొసఁగ
వలిచుట్టి పూదండ వెలిచుట్టు గననొప్పు
కప్పు చిప్పిలు సామకొప్పు దనర
ఝుళఝుళంఝుళనాద హాళ హాళితంబైన
బిరుదు వజ్రపు జల్లిపెండె మమర
మాటికిని మ్రోల జియడిండిమంబు మొరయ
రయము భయమును నయమును ప్రియము నమర
నమరవల్లభు కొలువున కరుగుదెంచె
రంభ సన్నుత నాట్యసంరంభయగుచు.

వ. ఇట్లరుగుదెంచి.

క. అమరీజనకరచాలిత
చమరీవాలానిలాభిచంచల దలక
భ్రమరీ సంయుతుఁడై వి
భ్రమరీతి చెలంగ హరి విరాజిలు చుండన్.

క. కనుఁగొని సమ్ముఖమునకుం
జన కటులే తెంచి వచ్చి సవినయ గతులన్
మును లోచనరుచి వీచిక
ల నీలములు వడసి చుట్టులన్ వైచి తగన్.

క. కరకంకణనిక్వణములు
బెరయఁగఁ దగ మ్రొక్కి లేచి పిఱిఁదికిఁ జని ని
ర్జరవల్లభు ముందఱఁ జం
దురు కావి చెఱంగుకప్పుతో నటునిల్చెన్.

క. నిలిచినఁ గనుఁగొని సురపతి
పలికెం గమలాస్యలాస్య పరిచితి నీకుం
దుల లే రెచ్చట నచ్చర
చెలువలలో నిది జగత్ప్రసిద్ధము సుమ్మీ.

క. అటుఁగన ఘనకార్యమ్మొ
క్కటి గలిగిన దిపుడు నీవు గడఁగి మనోభూ
పటుశరలక్షణమగు నీ
కటాక్షవీక్షణము చేత గాఁజేయదగున్.

చ. అన విని రంభ జంభరిపునాననముం గని స్వామి! నన్నుఁ జే
సిన బహుమాన మేమనుచుఁ జెప్పఁగ నవ్వి సమ స్తదిక్పతుల్
విని మది మెచ్చిరయ్య పదివేలువిధంబుల నట్టి నన్ను నీ
సొనరఁగ దిట్టినట్టి యలయూర్వశి గర్వము నొంచిరందఱున్

క. మొన్నటి యుత్సాహము నే
డున్నం దున నీప్రతాపమూఁతగఁ గొనియే
నెన్నంగఁ గార్యములు కను
సన్న నె ఘటియింప లేనె ? జగములు మెచ్చన్.

గీ. అన్న మీరు నాకు మన్నించియిచ్చిన,
బిరుదుఁ బూసియమరులరు కుపడఁగఁ
గేళిలోనఁ జొచ్చియేరాఁగ నూర్వశి
యుర్వశిధిల భావగర్వయగుచు.

క. బిరుదెవ్వరిచ్చి రే యూ
దొరకు న్నీకు నిఁక గీ_ర్తిదొరకుంగద ! నా
సరిపాత్రవె నీకెక్కడి
బిరుదని యెన్నుకొని నన్నుఁ బేర్కొని తిట్టెన్.

గీ. కొలువులో బిరుదు కాసెను నిలిచి లాస్య
కళలఁగలమేలు చూపంగవలయుఁగాక
వాకలదటంచు నెన్నేనివదరుచుండ
శిక్షఁ జేయకయుంట యుపేక్షగాదె ?

చ. భయమఱియాడె నెండియు సభన్నినుభంగ మొనర్తు నీపయిన్
దయగల యట్టి యర్థపతి నందనుఁడుం దలవంచ నంచులోఁ
బ్రియపడి యుండ్లనున్న దొరబిడ్డలవాడుదురే?సురేంద్ర! యూ
పయి నుఱి యేమివచ్చునో యుపాయము నేరఁగరాదుపిమ్మటన్.

గీ. కలవి లేనివి దొరసమ్ముఖమునఁ గల
దటంచు బలుకంగ వచ్చునె? యమరనాథ!
హరిణియనియెడు తామరసాక్షి సాక్షి
నిలిచియున్నది యదియెల్లఁ దెలిసికొనుచు.

క. లాలించి స్వామిబిరుదులు
పాలించితి రచుచు నపుడు వదరక యుంటిన్
వాళ్లించి విడుతుగర్వము
చాలించి సవంగ దానిసరివారు నగన్.

క. అని యిట్లు రంభ యూర్వశి
దనునాడిన పలుకులెల్లఁ దప్పక యుండన్
మునుకొని చెప్పినదంతయు
విని వెడవెడనవ్వి యమరవిభుఁ డవ్వేళన్.

క. ఔరా! యూర్వశి గర్వము
బీరము రంభకును మెచ్చి బిరుదిచ్చుటయే
నేరమె విద్యలు దెలియన్
నేరమె తనయాటనేర్పు నేఁ డేర్పరుతున్.

వ. అని పలికి యూర్వశి నిచటికిఁ దోడ్కొని రమ్మని వేత్రహస్తులంబనుప వారునుం జనిఁయొక్క హరినీలసౌధవీధి కాంత రాళంబగు శ్రమకూటంబున నచ్చరచెలుల కూటంబునకు నొజ్జయై నటనపాటవంబులుగరపు నత్తెఱవం గనుంగొని నేఁడు నిండోలగంబై యాఖండలుండు నృత్తప్రసంగంబుసేయుచు నిన్నుబిలువనంపెననిన నమ్మత్తకాశినియు నాననంబు ప్రకాశించ నేఁడు రంభాగర్వభంగంబును నేఁడు మదీయనాట్యవిజృంభణంబును నేర్పడుఁగదాయనుచును గై జేసి యుల్లంబున.

సీ. వలరాజు మదదంతి తలమాళిగయనంగఁ
గలికిచన్నులఁ బట్టుకంచె లలర
రతిచేతిజీనిసురఁటి యనా నిదియనంగఁ
గళుకుబంగరుఁ వ్రాఁత కాసెమెఱయ
శృంగారఫణిఫణాభంగిఁ దాయెతుచుట్లఁ
గప్పుమీఱుజెడసాము కొప్పుదనర
నంఘ్రిపద్మముచుట్టు నతివలయంబుగా
నీలాలసరపణుల్ నీటుసూపఁ
బసిఁడితీఁగెకునార్చిన పటికవోలెఁ
జిటులుగందంబు నెమ్మేన జిగి దొలంక
నృత్తవేషంబు మిక్కిలి బిత్తరింప
వచ్చె నూర్వశి సకియ లిర్వంకఁగొలువ.

ఉ. వచ్చి జోహారుసేసి నిలువన్ సురనాథుఁడు చూచి రంభతో
మచ్చరమేటికిన్ ? బిరుదుమాటలకుం బనియేమి ? నీకు నీ
పెచ్చులువల్కనేల నినుఁబెంచినతండ్రికిఁ గీర్తిఁమిక్కిలిం
దెచ్చితి విద్యగల్గుటకుఁ దిట్టుటయే ఫల మింతచాలదే.

క. అని యిటునింద్రుఁడు పలికిన
విని యూర్వశి కేలుమొగిచి వినయంబున నో
ఘనవాహన; యెదురాడం
జన దైనను విన్నవింతు సర్వజ్ఞనిధీ !

క. ఇన్నాళ్ళునన్ను మిక్కిలి
మన్ననఁగావించి చాల మంచిన దీవే
కన్నడుగుసేసి తేమని
విన్నపమొనరింతు నీకు విబుధాధిపతీ !

క. నాకాధిప; యిటురంభన్
నాకుం బ్రతిసేయుటకు మనంబలరెఁ దగున్
లోకమున రెండుగల్గినఁ
గా కరయఁగ నొకటిమేలు గానందగునే.

ఉ. ఏలినవారుమెచ్చి బిరుదిచ్చినవార్తలు విన్నదానసై
తాళితిఁగాక తాబిరుముఁదాల్చితినంచు వహించెనోకొ నా
వేళనె యుందఱుంగనఁగవే బిరుదుల్ తెగఁగోసి దానిచే
బ్రాలఁగనీడిపించికొని వత్తుఁజుమీ యిటకున్ సురోత్తమా.

చుట్టును మిట్టిపడ దీనిఁ గొట్టించకయుంటి నేని హరిపట్టినే
యని దట్టించి కరంబున నురంబుఁ దట్టిదట్టి చెఱంగురంగునీ
లంపుఁ గుచ్చులు విచ్చలవిడిం జెదరి పరవంబదరి పదరింఖన్మ
ణిపుంఖితసింహాముఖబిరుదనూపురంబులు బిట్టు మొరయ
రయంబడర నడుగులు దాఁటింపుచు విద్యావిశేషంబు బాటిం
పుచు నెడనెడం జగడంపుజతదారి దనదారిం జూపువరపి యొ
క్కింతప్రక్క లెగయం జొక్కనగుచుఁ గ్రుక్కిళ్ళు మ్రింగుచు
మెడనిక్కించి కుంచె సారించు నెపంబున నెచ్చరింప మిగుల
మచ్చరింపుచు సంరంభంబున రంభఁ గదిసి యిట్లనియె.

చ. హరిహయుఁ డిచ్చినం బిరుదులందుటపాడితె నీకు రంభ సా
సరిగనదేశి శుద్ధబహుచారుల నాడఁగలావె యంచు వే
సరిగమెఱుంగుటంచు వగచందుగుకావి మెఱుంగురంగు బం
గరు నును గొంగుపట్టి సురకాంతల చెంత నె పంతమాడుచున్.

క. పట్టినరంభయుఁ జేయట
దట్టివడిం దగులుదట్టి తళుకు బెళుకు లి
ట్లట్టు మెఱుఁగుల తెఱంగునఁ
జుట్టున్ వలగొనఁగఁ దిరిగి సురపతితోడన్.

ఉ. దేవర యాజ్ఞ కే వెఱచితిన్ సురనాయక! కొంగుపట్టి న
న్నావల నొక్కయింతి నిలయంబునకుం జనఁజాలునయ్య! లో
చేవడ నిప్పుడూర్వశినిఁ జేయని యందఱనవ్వఁ జేయ నే
కావరమింకె నింక ననుఁగావుమటంచును బల్కెఁ బల్కఁగన్.

చ. అనవిని యూర్వశీరమణి యానన మింత చెమర్ప వాలుఁగం
గొనలను గెంపుడాల్చి గుడ గుబ్బమెఱుంగుమిటారి చన్నుల
ల్లనఁజలియింప నూర్పులు దళంబుగ వెండికఁగ్రమ్మనయ్యనం
గుని నునువాఁడిపువ్వుపరిగోలవిధంబున పల్కఁబల్కఁగన్.

గీ. వేయుగన్నులుగలిగిన వేల్పుఱేఁడు
తరముగననేర కిత్తరి బిరుదులిచ్చె
రంభవాదాను నిట్టి సంరంభముననె
జుణుఁగుగనియిచ్చె యూర్వశిసుద్దులెల్ల.

క. నాజనకుఁడు హరితత్కృప
నీజగదండమున వెలయు నిందులనొకచోఁ
దేజరిలు నొక్కదొరచేఁ
బూజగొనిన నీమగర్వము కెనగలదా.

వ. అనిన రంభ రోషవిజృంభణ సూచనలోచనకోణాంకురిత శోణప్రభామ్రేడిత కర్ణతాటంకరత్నప్రభాడంబర యగుచు నిట్లనియె.

క. హరి మన్ననగలదంచును
గరువంబునఁ బలికె దీవు కనుగానక యా
హరిమన్నన నాకుంగల
దరయఁగ నీమహిమలెల్ల నమటులెఱుఁగరా.

క. ఇతఁడింద్రుఁ డతఁడుపేంద్రుం
డితనికి నతనికిని వాసి యెఱుఁగఁగరాదే

చుట్టును మిట్టిపడ దీనిఁ గొట్టించకయుంటినేని హరిపట్టినే యని దట్టించి కరంబున నురంబుఁ దట్టిదట్టి చెఱంగురంగుసీలంపుఁ గుచ్చులు విచ్చలవిడిం జెదరి పరవంబదరి పదరింఖన్మణిపుంఖితసింహముఖబిరుదనూపురంబులు బిట్టు మొరయు రయంబడర నడుగులుదాఁటింపుచు విద్యావిశేషంబు బాటింపుచు నెడనెడంజగడంపుజడదారి దనదారింజూపువరపి యొక్కింతప్రక్క లెగయంజొక్కనగుచుఁ గ్రుక్కిళ్ళుమ్రింగుచు మెడనిక్కించి కుంచెసారించునెపంబున నెచ్చరింప మిగుల మచ్చరింపుచు సంరంభంబున రంభంగదసి యిట్లనియె.

చ. హరిహయుఁడిచ్చినం బిరుదులందుటపాడిమె నీకురంభసా
సరిగనదేశి శుద్ధబహుచారుల నాడఁగలావె యంచు వే
సరిగ మెఱుంగుటంచు వగచందురుకావి మెఱుంగురంగుబం
గరునునుగొంగుపట్టి సురకాంతలచెంత నె పంతమాడుచున్.

క. పట్టినరంభయుఁ జేయట
దట్టివడిం దగులుదట్టి తళుకుబెళుకు లి
ట్టట్టు మెఱుఁగుల తెఱంగునఁ
జుట్టున్ వలగొనఁగఁ దిరిగి సురపతితోడన్.

ఉ. దేవరయాజ్ఞ కేవెఱచితిన్ సురనాయక! కొంగుపట్టి న
న్నావల నొక్కయింతి నిలయంబునకుం జనఁజాలునయ్య! లో
చేవడ నిప్పుడూర్వశినిఁ జేయని యందఱనవ్వఁ జేయ నే
కావరమింకె నింక ననుఁగావుమటంచును బల్కెఁబల్కఁగన్.

చ. అనవిని యూర్వశీరమణి యానన మింత చెమర్ప వాలుఁగం
గొనలను గెంపుడాల్చిగుడ గుబ్బమెఱుంగుమిటారి చన్నుల
ల్లనఁజలియింప నూర్పులు దళంబుగ వెండిగఁ గ్రమ్మనయ్యనం
గుని నునువాడిపువ్వుఁ పరిగోలవిధంబున పల్కఁబల్కఁగన్.

గీ. వేయుగన్నులుగలిగిన వేల్పుఱేఁడు
తరముగననేర కిత్తరి బిరుసులిచ్చె
రంభవాదాను నిట్టి సంరంభముననె
జుణుఁగుగనియిచ్చె యూర్వశిసుద్దులెల్ల.

క. నాజనకుఁడు హరితత్కృప
నీజగదండమున వెలయు నిందులనొక చోఁ
దేజరిలు నొక్కెడారచేఁ
బూజగొనిన నీకుగర్వమున కెనగలదా.

వ. అనిన రంభ రోషవిజృంభణ సూచనలోచనకోణాంకురిత శోణప్రభామ్రేడిత కర్ణతాటంకరత్నప్రభాడంబర యగుచు నిట్లనియె.

క. హరి మన్ననగలదంచును
గరువంబునఁ బలికె దీవు కనుగానక యా
హరిమన్నన నాకుంగల
దరయఁగ నీమహిమలెల్ల నమట్టులెఱుఁగరా.

క. ఇతఁడింద్రుఁ డతఁడుపేంద్రుం
డితనికి నతనికిని వాసి యెఱుఁగఁగరాదే

పితృభక్తి నెప్డియేనియు
నతిశయముగఁబలికె దిది యహంకృతియనరే.

సీ. ఆదితాళము ద్వితీయకమంతరక్రీడ
జయమంగళమ్మును జంపెలీల
చాచపుటంబు చచ్చత్పుటంబును షట్పి
తాపుత్రికంబు విద్యాధరంబు
రతిహంసలీల శ్రీరంగంబురంగంబు
కంకాళఖండకా కాధములును
కోకిలప్రియము విలోకితంబు కుడుక్క
డెంకి త్రిభంగి మట్టెగవిజయము
నందినందన జయసింహానందనములు
మొదలుగాఁగలతాళముల్ మొనసినున్న
గూడి కవచట్టముగఁ గొనియాడితేని
బిరుదులివియిత్తుసీకు నేబిరుదటంచు.

ఉ. బేరణి, తండలాస్యమును, బెక్కణి, కుండలి, నాఁజతుర్విధో
దారములైన నాట్యముల యందము నెల్ల నెఱింగియుందు నే
పారుచునుండ ముందు విధులాఱునునై తగునంగహారముల్
రా రసభావదృష్టులలరన్ నటియించెదె మాటలేటికిన్.

వ. అనిన నూర్వశి గర్వసింధుబంధురతరంగాయిత భ్రూభంగయ
గుచు నిట్లనియె.

క. నలినాక్షుఁ డుపేంద్రుండై
బలినడవఁగ స్వర్గమర్త్యపాతాళంబుల్
గొలువఁడె పాదత్రయి నా
యలఘుమహిమ యెవరికైన నలవడఁగలదే.

సీ. సంయుతాసంయుత సంజీవహస్తముల్
పదమూఁడు నొకయిరువదియునాల్గు
త్రింశద్గణంబున నృత్తహస్తంబులు
నై దుపక్షంబులు నైదుఘుటలు
స్కంధంబులాఱును గంధరల్తొమ్మిది
జానువులేడు పార్శ్వంబులేడు
నుత్తమాంగంబు లేకోనవింశతిదశ
బాహుల్ త్రికుక్షులుఁ బదము లాఱు
స్థాయిదృష్టులెనిమిది సంచారిభావ
దృష్టులిరువది రసదృష్టులెనిమిదియును
బొంకముగఁజూపి వింతకోపులు సెలంగ
నాడఁగలిగినఁ గలహించఁ బాడిసీకు.

ఉ. అప్పుడె యేల యిప్పుడును నాఁగకమానగుగొంగు వట్టెదే?
యిప్పరుహూతుముందఱ నె యిందఱుచూడఁగనీవుచూచెదే
జెప్పఁగనేల యేమనినఁ జెల్లదె విద్యలుగల్గువారికిం
దప్పక యాడుచాలు నెక తొమ్మియయొక్కటివింతకోపులన్.

క. ఆడుము నీబిగువులు వో
నాడుము పలుకులకు నేమి యదిగాకున్నఁ
బాడుము చదువుము మిన్నక
కూడునె యిటువంటిబిరుదుగొన వేమందుర్.

క. అనవిని రంభ విజృంభణ
మొనరంగాఁబలికె నలుక నూర్వశిఁ జూచి !
నినువంటి మచ్చెకంటికి
ననువగునే యిట్టులాడి యాడించుకొనన్.

వ. అని యిట్లు వెండియు నొండొరులమీఱుచు సాటికిం బేటికిఁ
బాటిల్లు రోసంబున నెడనెడ హాసంబు లడర మణికంకణ
ఝుణఝుణరణితంబులు బెరయ రయంబునం గరంబులు
త్రిప్పుచుసూక్ష్మకటాక్షవీక్షణంబులంగప్పుచు నుక్తిప్రత్యు
చమత్కారంబులు మీఱ నహంకారంబున.

క. మానిని యేకాశీతి
స్థానంబులమెఱసి నిలిచి దశమండలముల్
పూని నటియించు మెచ్చెద
మానసమున నీరసంబు మానకయున్నన్.

క. కరణములు నూటయెనిమిది
వరుసంగొను నీకుమెచ్చి వరమిచ్చెద నా
సరిఁగొంతవత్తువని స
త్కరణంబులు గలుగునిపుడ తగసభలోనన్.

గీ. కడఁగి షట్త్రింశదుత్ప్లుతకరణములును
హావణుగమకించి యెనుబదియాఱుగగన
భూమిచారులు గలుగు నేర్పులును మిఱసి,
శ్రమమమరనిల్పియున్న నాసాటివత్తు.

గీ. అబలయాంగికవాచికాహార్యసాత్త్వి
కములనఁగమించు నభినయక్రమములమర
నమరవిభుమ్రోఁది దరువులహొరువుల్ల
సరసముగఁగొను విరసంపుసరణులెల్ల.

ఉ. ఇచ్చట నేల యిద్దఱము నిప్పుడయేఁగి సభాంతరంబులన్
మెచ్చులుదెత్తమిద్ధకలమేల్ప్రకటించుచు నింటఁగెల్చి యా
రచ్చనుగెల్వఁగావలయు రట్టిడివా దిటువంటి సుద్దులే
నిచ్చినఁగాని యింకఁజలియించు నెరంభ యుదంభయుక్తులన్.

సీ. జడధిభంగముతోడి జనియించినట్టిసి
కే భంగమునకు నింకేలతలఁక
జడనిధిశాయికి జనియించినప్పుడే
భంగంబునీకుఁ జొప్పడకయున్నె
దళమెత్తియాడిన తలవంచెదవునీవు
రంభయిందులకు సంరంభమేల
దళమైనవిద్యయందము చూపకుండినఁ
దలవంపు నీకెపో తలిరుఁబోఁడి

యర్థపతిపట్టిఁ జేపట్టినట్టికతన
నిట్టిగర్వంబు పుట్టెనో యిదిసహజమొ
యర్థవంతునివిద్యయే యతిశయించు
నర్థమూలంపు జగమెల్ల ననఁగవినవె ?

సీ. దారుసంజీవని చారుసంగీత వి
ద్యకునుండ నీగాన మలరఁగలదె ?
కనకాంగి క్రమమె చేకొనియుండ నాభ్రమోల
నీయభినయమింక నిలువఁగలదె ?
పుంజికస్థలశబ్దముల పుంజిగనుపించు
టకెపూన నీపల్కు ప్రకటమగునె ?
క్రతుశుల్కదేశినిల్కడల కేననిపల్క
నీమాటపరిపాటి నెగడఁగలదె ?
వెండిమొక్కకవిద్య కే వేలువేలు
రచ్చకెక్కినయచ్చరల్ మచ్చరించి
యుచ్చరించినమాత్ర నీ యొచ్చెమెంచ
హెచ్చియుండంగ నీగర్వ మెంతగలదు.

క. అచ్చరలు నేఁడు క్రొత్తగ
వచ్చిరొ ? నావిద్యఁ గలుగువగలెల్లను వా
రిచ్చల నిచ్చలు మెచ్చరొ ?
మచ్చరమింతేల తేలమాటాడుదు రే.

క. అని యిట్లు రంభయూర్వశి
యును గలహించంగ నింద్రుఁ డోహో! నిలురం
భ! నిలువు మూర్వశి! యని వా
రిని వారించుచును డగ్గరికిఁ బిల్చి తగన్.

క. చెలులార! మీదువిద్యా
విలసనములమహిమ నేఁడు వింతగఁ జూడన్
వలెనె కిరీటము వెట్టిన
తలకు న్నుల్లఘుగఁబోవఁ దగునే యెంకున్.

ఉ. మానినులార! మీనటన మార్గములందుఁ బరస్పరాధిక
న్యూనత లెంచ లేఁడు హరియుం దమసాతటినిష్ఠ నుగ్రతం
బూనితపంబు సల్పెడుఁ దపోధనశేఖరుఁ డొక్కఁడుండు మీ
మీ నిపుణత్వము ల్దెలియ మేకొని యమ్ముని లోను జేసినన్.

సీ. లోచూపుమరలించి లోచనంబులువిచ్చి
సోగమీ మొగములే చూచుచుండ
మంత్రస్మరణమాని మానంబు దిగద్రోచి
యలరి మీతోడనె పలుకుచుండ
బద్ధాసనమువీడి భావస్థిరతఁ బాసి
మరఁగి మీ వెంటనె తిరుగుచుండ
ననశనస్థితి విడించి యనిలపూరణ రోసి
మీ రిచ్చుఫలములే మెసవుచుండ

నలమహాముని దోమది యలరుటంప
సోనలనుముంచి తత్తపస్స్ఫురితతాప
మెల్లఁబో మెల్లనే యలయించి మీరు
చన్నుఁగొండలపై నుండఁ జన్నవలయు.

క. ఇద్దఱిలోపల నెవ్వతె
దద్దరిలక యతనిధైర్యధనముఁగొనేడు నా
ముద్దియకే యీబిరుదుల
పద్దులుదగు నిదినిజంబు భామినులారా !

చ. అని సురనాథుఁ డాచెలులకప్పుడు కల్పకసంభవంబులౌ
ఘనమణిభూషణంబులును గాంచనచంద్రకితాంచలంబులై
కననగుచంద్రకావి నునుగాన్పులుఁగొమ్మని యిచ్చి వేగ బో
మ్మనినకరాబ్జముల్మొగిచియచ్చరనెచ్చెలులిచ్చమెచ్చఁగన్.

సీ. చెఱకువిల్లసదని వెఱకుమా యీకొమ్మ
బోమవింటనలిమౌర్వి మోతుగాని
కాలంబుగాదని కళవళపడకుమీ
కలికిపాటలఁజూచి నిలుతుగాని
యెదఁగందుననుగుంది యెదవశేకుండుమీ
సఖమోముచాయనే చనుముఁగాని
గందంపుఁగొండపై బొందు లేదనకుమీ
చెలియూర్పునెత్తావిఁ బొలుతుగాని

మదనమాధవ శశధర మలయపవన
యచుచుగతిచూపి శుకపికహంసభృంగ
కేకులకు సతిపల్కులు గీతినడయు
చూపుఁగురులును బలభేది చూపిపనుప.

గీ. ఇంతమాత్రంబు మీ రానతిచ్చినపుడె
యెంతయుఁగుందొ? యూహాని యేమియైన
నేమి నీకృపగల్గిన స్వామి యెట్టి
కార్యమైనను సాధింపఁగలము సుమ్ము.

క. మందమురుదిందుమాధవ
కందర్పాములను దోడుగా నిడుకొని సం
క్రందన కదలెద మే మిదె
మందాకినిదాఁటి నేఁడె మహిమండలికిన్.

క. అనియనిపించుకొని సురాం
గన లమ్మునినెమ్మనంబు గరఁగించుటకున్
గినుసన్నలనె యుపాయము,
లనువుగ నూహింపుమని ప్రయాణోన్ముఖలై.

సీ. పుంజకస్థలయులంబు సమనోరమ హేమ
దారు సంజీవనిచారునేత్ర
కనకాంగి ధాన్యమాలిని వపుష్మతి శుచి
స్మిత సులోచననీల మిత్రకేళి

దేవవిద్యుద్వర్ణ దివ్యతిలోత్తమ
చిత్రసేన ఘృతాచి చిత్రరేఖ
జలజాస్యమేనక శశిరేఖ గోపాలి
ప్రమ్లోచవిశ్వాచి పంచమాంళ
లలితక్రతుశుల్క కర్పూరతిలక హారిణి
మొదలుగాఁగల యచ్చరముదితలెల్ల
నోసరఁ దముగొల్వ రంభయు నూర్వశియును
నందనవనంబునకునేఁగి యందు నిల్చి.

క. మందారకల్పతరు హరి
చందన సంతానపారిజాతంబుల చేఁ
బొందుగ భూలోకంబున
కుం దగిన సువస్తుతతులుఁ గొనుచున్ వేడ్కన్.

క. నందనము వెడలిపయనఁపు
టందము గలవాదిపూఁత లలఁది తోడవులం
గుందనఁపుటంచువగ జిలు
గుం దెలిసాలియలు జారుఁగొప్పులు నోప్పన్.

చ. నడచిరి యంత రంభభవనంబున నుండెడుసోమయాజు లె
క్కుడుతమిఁ బాయలేమివడిఁగూడఁగ రం డిటు వాజపేయులె
క్కడిపయనంబువచ్చె మనకర్మము లీగతినుండె నేఁటికిన్
జడిసెడు పౌండరీకులని సారెకుఁబల్కుచు నెండకల్కుచున్.

క. పెంజెమటజార దోవతి
పింజెలుమాటికిని గాళ్ళఁ బెనఁగొనఁ గడుపుల్
గుంజెలు వెట్టఁగ వేలుపు
లంజలఁ గూడంగఁ జని హాళాహాళిమెఱయన్.

సీ. రత్నకంబళ మతిరాత్రులుగొంచురా
సర్వతోముఖులు వేసరఁగ నేల ?
తాళవృతంబు మాపాలిది చయనులు
జగడంబులాడక చనుఁడుకడకుఁ
గపురంపుఁ బెట్టె మీకట్టడయొఱుఁగరా ?
సత్రయాజులకింత చలముగలదె ?
ముత్యాలచౌకట్ల మూటమామోపాట
తెలియదే ? వాజపేయులకు నెపుడు
నాఁడె క్రతువులు రామార్పణముగఁ జేయ
కునికి మేపాటువాటిల్లె మనలకనుచు
సారిగిఁ జనుదెంచుయుజ్వలజూచి నవ్వి
యవ్విబుధకామినులు వారి ననిపి యచట.

క. తగువారి వెంటరమ్మని
గగనంబున నడచి రింద్రుఘనసౌధంబున్
మగుడిమగుడిచూచుచు న
మ్మగువలుమఱి వారినంటి మార్గమునందున్.

ఉ. పట్టుగుడారముల్ చికిలి బంగరుఁవ్రాఁతల చిక్కుబీగపుం
బెట్టెలుఁ బచ్చఱాపలకపీఁటలు మేలివకాసుకుట్టుమేల్
కట్టులు గ్రొత్తనెత్తపలకల్ తెరలుం బిక దారిఁ బారువా
బిట్టలగూండ్లుఁ గ్రొమ్ముఁగుబిందెలుఁ గొందఱు తెచ్చిర య్యెడన్.

సీ. దంటనీలంపు చిక్కంటలు దంతంపు
దువ్వెన ల్కుంకుమ పువ్వుఁబఱపు
సకినలమంచముల్ చౌకంపుఁబొంబట్లు
బటువులు రాచిల్క పంజరములు
పరిమళంబుల యుబ్బు బరిణలు చంద్రకాం
తపుఁగోరలు విరికుందనపుగిండ్లు
నిలువుటద్దములు వీణియలు దండియలును
దాళము ల్వేణువాద్యము లురుములు
నారజంబులు ముఖవీణలానకములు
మద్దెల లుపాంగములు స్వరమండలములు
మొదలుగాఁగల సాధనంబులు ధరించి
కొంద ఱాగిరి వెనువెంటఁగూడి యపుడు.

సీ. భృంగింబ ! చెలిచూపు బెళుకులో నిలువుమీ !
మొక్కలంబుననొంటి మొక్కపోక
చిలుకచిలుకలకొల్కి పలుకులో మెలఁగుమీ !
నీరంబునను జెలి ! బీరువోక

యంచయంచితయాన ! యడుగులోనడువుమీ !
బింకంపునడుమదం బింకిపోక
కోయిలకలకంఠి ! కుత్తుకై యుండుమీ !
మోడితోఁజని మొగమోడిపోక
ననుచు బలములమున్నుగా నరిచి తనకు
వెన్నుఁబలమయి మాధవ విధుసమీరు
లంటినడవంగఁ గదలెఁ బూవింటిజోదు
దండనద్దండ పుండ్రకోదండుఁ డగుచు.

ఉ. ఇక్కరణింబురందర పురేందుముఖుల్ చనికాంచిరెంతయుం
జక్కనిచాయ నుల్లసితసారసహంసరథాంగభృంగ స
మ్యక్కలనాద మేదుర నిరంతరతుంగతరంగ ఘోషముల్
దిక్కులనిండఁ బొంగురుచుఁదేరు సురాపగవేడుకల్దగన్.

గీ. కాంచి రంభోర్వశులు మదిఁగౌతుకమున
విష్ణుపదియన నీనది వెలయుఁజూవె
యింముకుల్యల సాఫల్యమొందు మనదు
నందనంబును దీనికి వందనంబు.

వ. అని నమస్కరించి వెండియు నయ్యండజయాన లొండొరు
లం గనుఁగొని.

ఉ. కన్నెవిటారి బేడిసలు కన్నులచెన్ను వహింపజక్కవల్
చన్నులచందమొప్ప జలజాతపరాగము హత్తి ప్రత్తిపూ

వన్నియలీలనొప్పఁ గనులారవిలాసిని వోలె నందమై
యున్నదియిన్నదీమణితిలోత్తమచూచి తె? యెంతయొప్పెడున్.

క. అభ్రకరిజలములోపల
నభ్రమువుందాను గ్రీడలాడెడుఁగంటే?
విభ్రమమున నిచటే మ
త్తభ్రమరములల్ల గండతలముల నిండన్.

చ. పగడపుఁజాయముక్కులును బాదయుగంబులుఁ బైడిరెక్కలున్
జిగినునుసోగవెన్నెలలఁ జిమ్ముమేనులు మించనంచలీ
గగనతరంగిణీవికచకాంచనకంజ వనీగృహంబులన్
సొగసి, రమించుచున్నయవి చూచితె?చారుచకోరలోచనా.

క. అని తన్మహిమముఁ బొగడుచుఁ
జనిచని తమసాతటంబు చాయనె గగనం
బుననుండి దిగిరినిర్జర
వనిత లవనితలము నవయువద్యుతిగ్రమ్మన్.

సీ. జలదకదంబముల్ చంద్రబింబంబులు
శరభముల్ విద్రుమసముదయములు
శంఖసంఘములు గాంచనలతావలయముల్
చక్రవాకంబులు జలరుహములు
మెఱుఁగుఁదీగియలుఁ గ్రొమ్మించుమానికములు
నావర్తములు సైకతావళులును
కరికరంబులు బాలకమఠముల్ మౌక్తిక
పాళికల్నవ్యప్రవాళములును

గగన జలనిధిలోనుండి కలసిమొక్క
పరియకొరిగెనో యనఁగఁజూపరకుఁదోఁచెఁ
గాంతకరలీల గీర్వాణకాంతలెల్ల
దివిమెఱయంగ నవనికి డిగ్గునపుడు.

సీ. వియదంబునిధినుండి వెడలివచ్చుననేక
లావణ్యమయమాయ లక్ష్ములనఁగ
బ్రహ్మాండఖనిఁబుట్టి పఱతెంచుజీవ క
ళాకలితమణిశలాక లనఁగ
జలదబృందంబులోపల నుండి దిగువకే
తెంచు కారుమెఱుంగుఁదీఁగెలనఁగ
మిన్నేటినుండి భూమికి వ్రాలు గన్నెప్రా
యఁపుమేలిపసిఁడి రాయంచలనఁగఁ

జూడఁదగి యమరుల్లోకసుదతు లవని
కవతరింపుచుఁ దమనాతటాంచలమున
నిలిచి తమతమసారస్యములు సెలంగ
మెలఁగుచుండఁగఁ బరిచారకులు గడంగి.

క. అహ్మానితవ మొనర్చు వ
నమ్మానకుం గట్టిదూరఁగనందగుబయలన్
గ్రమ్మికొని పొదలువకుళకు
లమ్మాల ఘుమ్మను సమస్థలంబున నొకచోన్.

చ. సమముగమిట్టపల్లములు చక్కఁగఁజేయుచుఁ జుట్టి నీరువా
టముఁగని నాల్గువంకల గుడారములెత్తిరి చీనిపట్టు ప
గ్గములు బిగించి కూటములుఁగట్టివరాతులకూర్చిముందటం
గొమరగు పైఁడితీవ పనికుట్టుల చప్పరముల్ చెలంగఁగన్.

ఉ. అక్కడి చాయరంభయును నాత్మసఖీమణులెల్లఁ గొల్వఁగా
జెక్కసలారు రాచిలుక జెక్కుపు మేలిగుడారునందు సొం
పెక్కవసించె నూర్వశియు నిష్టవయస్యలఁ గూడిగండుమీన్
జెక్కియపు గుడారమునవిల్చెఁబథశ్రమముల్ దొఱంగఁగన్.

ఉ. అంతట నంశుమంతుఁ డపరాంబుధిఁజేరె శకుంతసంతతుల్
బంతులుగట్టిగూళ్ళకెగఁబాఱఁగ సాగె దిగంతసీమలన్
సంతమసంబుపేరె జలజంబులుదారె రథాంగపంక్తికిన్
గంతులుదీఱె నుత్పలవనంబులనాడఁగఁజేరె భృంగముల్.

సీ. గగనాంబునిధిలోనఁ గనుపించుమౌక్తిక
నికరంబులనఁగఁ దారకలునిక్కెఁ
దారకాంగనలెల్లఁ దమినాడుకుందకం
దుకము చందమునఁ జంద్రుండుదోఁచె
చంద్రుఁగన్గొని పాలసంద్రంబుపైకుబ్బి
నిండెనాఁ బండువెన్నెలలుగాసె
వెన్నెలబైట గర్వించి పంచశరుండు
కలువపూపులను లక్ష్యంబుజేసె

గలువతూపులమర్మము గాడ బెదరి
పదరి మొత్తపరాకుఁ బాన్పులందు
బల్లవులఁ గౌఁగిలించిరి పల్లవోష్ఠు
లలఁతి తెమ్మెర నెమ్మేని యలఁతదీర్ప.

చ. నిలిచిన తేటవెన్నెలలనీడలు చూచుచుగట్టి వెన్నెలల్
జిలుగుమెఱుంగు ముక్కుతుదఁజించిమొసంగుచుదప్పిగప్పినం
బలుచనితియ్య వెన్నెలల పానము సేయుచుఁ బ్రేమడాయుచున్
మొలఁకువమించనయ్యెడ రమించఁదొడంగెఁ జకోరదంపతుల్

క. ఇమ్మాడ్కి జనానందక
రమ్యగ వెన్నెలలుగాయ రంభోర్వశులున్
గుమ్మెనగుడారములకడ
ఘుమ్మను కపురంపుజగతిఁ గూర్చుండి తగన్.

గీ. దండియలు మీటి రహిగానదంతిచెలఁగ
నింద్రుమీఁదటిపదము లెన్నేని వింత
వర్ణములఁ గాడి యుత్పలవాసితంబు
లైన గంధోదములు గ్రోలి హాళిదేలి.

ఉ. చొక్కుచునచ్చటన్ ముదముసొంపునసోలుచునుండియంతటం
జక్కనిపైడితీవపని చప్పరమంచములన్ వసించి రం
పెక్కుఁగ నూడిగంపు జెలు లివ్వల నవ్వలఁ గంకణధ్వనుల్
పిక్కటిలంగఁ దాళగతి లీలలు హత్తి పదంబు లొత్తగన్.

వ. ఇవ్విధంబున వసంతంబు శుకపిక శిలీముఖ ముఖరితాఖిల దిగంతంబగుచు విజృంభించుచునుండ.

ఉ. చందురుకావిపావడలు జాజిపిఱుందులఁ జిందుద్రొక్కఁగా
గందుపిసాళి పాళియలుగట్టి కదంబపుఁ బూఁత తాఁకిం
జెందిన తేఁటిదాఁటులనఁ జెన్నగు కేలుజడల్ నటింపనా
సుందరులందఱున్ వనము సొచ్చి చలన్మణినూపురంబుగన్

ఉ. కేరుచు సవ్వధూమణులు కేలివనిన్ విహరించి కొందఱం
జేరుచుఁ గన్నెగేదఁగులఁ జీరుచుఁ బూఁబొదరిండ్లు వేఁడుకన్
దూరుచు రాని నెచ్చెలుల దూరుచుఁ గమ్మనిపువ్వుఁదోఁట్లలోఁ
గూరుచు సారసౌరభముఁ గూరుచు చల్లనిగాడ్పుఁ గోరుచున్

ర గ డ.

నిచ్చ నిచ్చగ నలరుదండలు నిండ నిండ యనుంగుఁ జెలులకు
విచ్చ విచ్చన విడివిరుల్ గురువింద విందొనరించె నలులకుఁ
గలికి కలికిలతలను దుమ్మెద గంతు గంతులు చూపుమాటికిఁ
జిలుక చిలుకల కొల్కిపలుకులఁ జిక్కఁ జిక్కులఁ బెట్టనేటికిఁ
గంతు కంతుకము లనఁదగునిది గాదె గాదెకుమిగులుగుత్తువె
చెలియ చెలియల నీకు నేసన జిర జిరఁగదిలి చెంత వత్తురె
చిలువ చిలుప మరందరసముల జెట్టచెట్టల విద్య మెత్తురె,
కన్నె కన్నెర చేయనేటికి గానఁగా నవమల్లి మొగడలు
నన్ను నన్నున నీకుదగునటె నవ్య నవ్వుల లేవెపొగడలు
మోదు మోదుగ పువ్వు రెచ్చెను మున్న మున్నర కైకముచ్చిరి

లేమ లేమండఁగ ముదిరికిని లేమ లేముఖు పాటు వచ్చిరి
దాడి దాడిమములకుఁ బెట్టెను తరుణి తరుణిమ గర్వమెంతన
నీడ నీడలు నిండెఁ బ్రేమము నిక్కనిక్కడ నిల్తమింతన
కంటె కంటె యొనర్చునిది శుభ కాంతి కాంతికి లతికజాతికి
నంటునంటునఁ బుష్పాదుల నదినాననానఁగఁ జేసె నాతికిఁ
హాళిహాలి కుచంబులంటిన నాతినాతిశనాన దిట్టను
బాళిబాలిక పువ్వు లేదని పల్కఁబల్కను గోవుకట్టెను
కలికి కలికుచ యీపునెమ్మదిఁ గ్రమ్మఁగ్రమ్మఁట వాముపెట్టను
దళముదళముగ రాతిసరిపోద దండదండము నీకుమెట్టను
యిప్పుయిప్పటి కింపునింపెఁడు నిండు నిండునిభాస్యనిల్తమె
యప్ప యప్పుకువంపు మొగ్గల యూసయూసతి వల్లఁబెల్తమె
చామచామనమేని యాచెలి జడముజడను వడంగ వేసెను
రామరామ మరందఘనసుమ రాజిరాజిల నదియకోసెను
మాడిమాడి ఫలంబులగడిటు మలయములయజగంధి ముందఱ
ననలననలస గతులఁగోసి చనంగనంగన యిపుడు వచ్చెను
మనముమనమున నెపుడు నీచెలి మాటమాటగ నిటులు వెచ్చెను
చాలుచాలునగంటి మీరల సరసనరసను లాడఁగూడను
మేలు మేలుపడెన్ లతాంతము మీఁదమీఁదటి మెత్తుమాడను
లలన లలనద పుష్పగుచ్ఛపు లామలామజ్జిగముగంటిరె
యలికియలికి లతాంగి క్రొవ్విరి నంటునంటు ప్రసంగవింటిరె
వామవామగతిం జెనకి యిరు వంకవంకటు చూడువింతలు

వ. ఇవ్విధంబున వసంతంబు శుకపిక శిలీముఖ ముఖరితాఖిల దిగంతంబగుచు విజృంభించుచుండ.

ఉ. చందురు కావిపావడలు జూజు పిఱుందులఁ జిందుద్రొక్కఁగా
గందుపిసాళి పాళియలుగట్టి కదంబపుఁ బూఁత తావికిం
జెందిన తేఁటిదాఁటులనఁ జెన్నగు కీలుజడల్ నటింపనా
సుందరు లందఱున్ వనము సొచ్చి చలన్మణినూపురంబుగన్

ఉ. కేరుచు సవ్వధూమణులు కేళివనిన్ విహరించి కొందఱుం
జేరుచుఁ గన్నెగేదఁగులఁ జీరుచుఁ బూబొదరిండ్లు వేఁడుకన్
దూరుచు రాని నెచ్చెలుల దూరుచుఁ గమ్మనిపుప్పొళ్ళలోఁ
గూరుచు సారసౌరభముఁ గూరుచు చల్లనిగాడ్పుఁ గోరుచున్

ర గ డ.

నిచ్చ నిచ్చగ నలరుదండలు నిండ నిండ యనుంగుఁ జెలులకు
విచ్చు విచ్చున విడివిరుల్ గురువింద విందొనరించె నలులకుఁ
గలికి కలికిలతలను దుమ్మెద గంతు గంతులు చూపుమాటికిఁ
జిలుక చిలుకల కొల్కి పలుకులఁ జిక్కఁ జిక్కులఁ బెట్టనేటికిఁ
గంతు కంతుకము లనఁదగునిది గాదె గాదెకుమిగులుగుత్తువె
చెలియ చెలియల నీకు నేసిన జిర జిరఁగదిలి చెంత వత్తురె
చిలువ చిలుప మరందరసముల జెట్టచెట్టల విద్య మెత్తురె,
కన్నె కన్నెర చేయనేటికి గానఁగా నవమల్లి మొగడలు
నన్ను నన్నున నీకుదగునటె నవ్య నవ్వల లేవెపొగడలు
మోదు మోదుగ పువ్వు రెచ్చెను మున్న మున్నర కైకముచ్చిరి

లేమ లేమియుండగ ముదినికిని లేమ లేమయు పాటు వచ్చిరి
దాడి దాడిమములకుఁ బెట్టెను తరుణి తరుణిమ గర్వమెంతన
నీడ నీడలు నిండెఁ బ్రేమము నిక్కనిక్కడ నిల్తమింతన
కంటె కంటె యొనర్చునిది శుభ కాంతి కాంతికి లతికజాతికి
నంటునంటునఁ బుష్పదుల నదినాననానఁగఁ జేసె నాతికిఁ
హాళిహాలి కుచంబులంటిన నాతినాతిశనాన దిట్టను
బాళిబాలిక పువ్వులేదని పల్కఁబల్కను గోపుకట్టెను
కలికి కలికుచ యీషనెమ్మదిఁ గ్రమ్మఁగ్రమ్మఱ వామువెట్టను
దళముదళముగ రాతిసరిపోద దంశదంశము నీకుమెట్టను
యిప్పుయిప్పటి కింపునింపెఁను నింపు నింపునిభాస్యనిల్తమె
యప్ప యప్పుదువంపు మొగ్గల యూసయూసతి వల్లఁబెల్తమె
చామచామనమేని యూచెలి జడముజడను వడంగ వేసెను
రామరామ మరందఘనసుమ రాజిరాజిల నదియుకోసెను
మాదిమాది ఫలంబుతగదింబు మలయుములయజగంధి ముందఱ
ననలననలన గతులఁగోసి చనంగనంగన యిపుడు వచ్చెను
మానముమనమున నెపుడునీచెలి మాటమాటగనిటులు హెచ్చెను
చాలుచాలునగంటి మీరల సరససరసము లాడఁగూడను
మేలు మేలుపడెన్ లతాంతము మీఁదమీఁదటి యెత్తుమాడను
లలన లలనద పుష్పగుచ్ఛ లామలామజ్జిగముగంటిరె
యలికియలికి లతాంగి క్రొవ్విరి నంటునంటు పొసంగవింటిరె
వామవామగతిం జెనకిఖురు వంకవంకటు సూషువింతలు

యేమయేమనవచ్చు నెచ్చెలి కీరకీరము నియ్యముచ్చట
రాలరాలగరు ల్వాలివిసిగ రాఁగరాఁగత మేమియింతలు
యరసియరసికతాతటస్థలి యందయందఱు వలయుఁజేరఁగ
సరసిసరసిజములును గొనుఁడు వసంతసంతత కేళిమీఱఁగ.

క. అనివనిలో విహరింపుచుఁ
జనిచని చంద్రముఖు లిష్టసఖు లిరుగడలం
గనిమనికొలువఁగ నట య
మ్ముని యునికికి నేఁగి యతనిముందఱ వేట్కన్.

ఉ. తేనియ క్రొన్నన ల్పసిమి తియ్యని తియ్యని పండ్లుజాలఁగా
గానుకగాఁగనుంచి పదకంజములం బ్రణమిల్లి లేచి యో
మౌనివరేణ్య! పుణ్యమహిమన్ మిముఁగన్గొనఁగల్గెసత్కృపా
నూనకటాక్షవీక్షణము నూఁగఁ జేయుము మమ్ము నిత్తఱిన్.

క. అనిపలికి యతఁ డొకింతయుఁ
గనుదెఱవక పలుకకున్నఁ గని యందఱు నె
మ్మనమున నచ్చెరువందుచు
మును పెన్నఁడు గానమిట్టి ముని జగములలోన్.

క. గట్టిగను మూఁగదయ్యము
పట్టినదో కాక చెట్టొ బలురాచట్టో
యిట్టులు మనమిందఱమును
జుట్టుంబిలువఁగ నొకింత చూడక యున్నే.

సీ. హారినీలములతోడ సరినీటుపచరించు
కప్పుఁదేరెడు నునుగొప్పుగొప్పు
మీటేరుపడి మంచి కోటేరువెట్టిన
మురువుచూపట్టెడు ముక్కుచెక్కు
పాలుగారుచుఁ జంద్రు మేలుగానఁగనొప్పు
మోహనంబగు నగుమోముమోము
వాటమౌ రత్నకవాటమౌ నిదియనఁ
జాల శోభిలెడి వక్షంబురంబు
తళుకుబంగరుముప్పిరి తరఁటువోలె
నున్నయదిమేను చూడంగ మున్నితండు
విటుఁడయి చరించి కొన్నాళ్లు వెనుకఁదపసి
యయ్యెఁగా కిట్టి యందమెందైనఁ గలదె.

క. కనమే బిరాన నల్వా
రినపచ్చవిమొదలు జేగురించిన జడలుం
బెనువంక మెడలుగల య
మ్మునిజడలున్ సొంపులెడల ముల్లోకములన్.

క. యువతులనంగతులం గల
చవులెఱుఁగఁడు పుట్టుమొదలు సత్యముగా దే
నవలాలఁజూపుదలలన్
దవులనివాఁడుం గలాఁడె ధైర్యముతోడన్.

వ. అని యందఱు నన్నివిధంబులం బలుకుచుండ రంభ యిట్లనియె.

క. మద్దెలసద్దున నీతని
నిద్దురమబ్బెల్లఁబోవ నేర్పుమెఱయ నే
నిద్దముగ దెశిఁ గొనియెద
నొద్దికగానుండుఁ డనుచు నొనరిచి సఖులన్.

క. బంగరుకాసెయు ముత్తెపు
రంగులు చనుకట్టుఁబూని రంభ మిగుల మై
సింగారము వెలయఁగ ముని
పుంగవు నెదుటన్ మెఱుంగుపోలిక నిలిచెన్.

సీ. నిలిచి యటుఁజేచి పుష్పాం
జలి చేసి యసంయుతములు సంయుతహస్తం
బులుచూపి పసిఁడి గజ్జెలఁ
జెలఁగెడు చరణములు రవళిసేయుచు వేట్కన్.

క. తరుణీమణియొకర్తు తంబురామొరయించ
వెలఁదియొక్కతె ముఖవీణెయూఁద
సరసిజాక్షియొకర్తు స్వరమండలమువాఁచ
బోఁటియొక్కతె దండవీటిపాడ
విమలాంగియొక్కర్తు వీణియపలికించఁ
గలికియొక్కతె యుపాంగంబుపూనఁ
గిసలయాధరయొర్తు కిన్నరమీటంగ
లోలలోచనయొర్తు తాళమొత్త

మఱియుఁగొందఱు సుదతులు మద్దెలయును
నాదజము మొదలైన వాద్యములువట్టి
శ్రుతులుఘుమ్మని వావణించె నతివదేశి
నృత్తవైఖరిచూపె మునీంద్రునెదుట.

ఆ. ఇటుల మిగుల నేర్పు ఘటియిల్లఁజూపిన
నృత్యగీతవాద్య నిపుణమార్గ
పటిమ చెవిటిమ్రోలఁ బాడినసంకునా
ఫలము లేకపోవ బదరి రంభ.

సీ. ఒకకోపుచాలదే శుకవామదేవుల
కైనను దపము వాయంగఁజేయ
నొకచూపుచాలదే సకలదేవతలను
మోహమహాంబుధి మునుఁగఁజేయ
నొకపాటచాలదే యుర్విలోశైల సం
ఘములు నీరుగఁ గరఁగంగఁజేయ
నొకమాటచాలదే యుల్లోలకల్లోల
ముగఁ దేనెవంకలు నిగుడఁజేయ
బూని యిటువంటిబీరుదు కోపులును బెళుకుఁ
జూపులును వింతపాటలు సొగసుమాట
లు రహినెన్నిచూపిన మదిగరఁగదయ్యె
దయ్య మేమనిపుట్టించె నయ్య వీని.

వ. అని మఱియు ననేక ప్రకారంబులఁ బలుకుచుఁ దమనటన చాతుర్యంబున నతిధైర్యంబునుఁ దన విలాస భావంబున నతిజడభావంబును దేజస్తిమిర సంపర్కంబునుం బోలెనొక్కింతి యలంబొంకు వడకయున్న డెందంబునం గలంగుచు.

గీ. చిన్నబోయి రంభ చెక్కిటఁ జేయిడి
యున్న జూచి యంత నూర్వశియును
నేనొకింత దడవుగానంబుచే మాని
మనసు గరతు ననుచు ననుచు వేడ్క.

చ. సరిగ మెఱుంగుఁ జంటకుబుసంబునఁ జన్గవపిక్కటిల్ల మే
ల్తరమగు కావిపింజియపదంబులఁ జందులుద్రొక్క బచ్చక
ప్పురమున హెచ్చుకుంకుమపుఁబూతసుగంధము చోడుముట్టగ
వ్విరిసరులన్ సిరుల్దొలకు వేణిచలింపఁగ వచ్చి యచ్చటన్.

క. మునికట్టెదుర నొయారము
దనరఁగఁ గూర్చుండి యొక్కతరుణీమణిఁగ
న్గొని వీణియఁ దెమ్మని చ
క్కనిపలుకులఁ దేనెలొలుకఁగాఁ బలుకుటయున్.

సీ. తళుకు నీలపు దట్టములువోలె నీడలు
గానంగఁ దగు గుబ్బకాయలమర
రతనాల పూసల రాజిల్లెడు సిరాజి
పగడంపు మెట్టులజిగి దొలంకఁ

భ్రమర రాగ లతాంకురములు వ్రాకినలీల
మెఱుఁగారు తంత్రులు మీటుచూప
ఘుమఘుమ ధ్వని నించు గ్రొవ్విన యపరంజి
కళుకుల యనుసుల మొళుకు దనర
జీవ రత్నంపు మేరువు చికిలి కెంపు
బిరడలును గరుడ పచ్చల కరివెజీవి
వ్రాత హారంబట్టు గవిసెనరాణ దనరు
వీణె యొకయింతి నిల్చెను వెలఁది యెదుట.

వ. ఇట్లు తెచ్చిన విపంచికి నమస్కరించి పాణి యుగంబునఁ
గైకొని.

సీ. గవిసెన సడలించి కరపంకజద్యుతి
గడలు కోఁజీని పావడలు దుడిచి
బలితంపు మెఱుఁగు గుబ్బలమీఁదఁదీర్చిఘు
మ్మన నఖంబుల శ్రుతులంటిమీటి
జవ్వాదిఁ బదనిచ్చి సారెను ల్సారించి
సరసత బిరడలు చక్కనొత్తి
మంద్రమధ్యమ తార మహిమమీఱంగఁ ద్రి
స్థానంబులుమ ముట్టి తాళగతుల
నతులకంకణ ఝణఝణత్కృతులు సెలఁగ
మాయురే ! యన రాగముల్ దాయములును
గీతములు ప్రబంధములు రక్తిఁగానుపించ
వీణెమీఁటెను నాసిలవేణి యపుడు.

మ. లలనారత్నము గానమాధురికి శైలంబుల్గరంగెన్ మృగం
బులు మేపుల్విడి చూచుచుండె నచల న్మూర్ధాగ్రకర్ణంబులై
చెలఁగెన్ బక్షిగణంబు మోడులుచిగిర్చెన్ మానిడెందంబుని
శ్చలభావంబున నంతకంతకుఁగడున్ సంధించెఁగాఠిన్యమున్.

క. అదిగని యూర్వశి నవ్వుచు
నదిరామది ఈయువంటి దనియెను పలుకుం
బెదరె నుపాయన మొక్కటి
వెనుకవలయు వీనిమదికి విశ్వములోనన్.

శా. ఔరా రాగము బాపురే మొనగు రాయంబుల్ బళీ! స్థాయిసం
చారీప్రాపులు లెస్స కంపితముమైచా గోహరా మేలమ్మ య
య్యారే మీటుకోలంబు పాడఁదగునాహా రక్తియంచున్ సభా
స్తారుల్లేరట మెచ్చ నీజమఁడు మెచ్చున్ నేర్చునే గానమున్.

క. అనిపాక్కిలికి రంభం
గనుఁగొని మనతగవుఁదీర్చెఁగా మునితపమే
ఘనులతపంబులు చెఱుపం
బనిచిన నీకె జనఁగవలదు పదివేలైనన్.

క. అప్పయుఁజెల్లెలు బలె మన
మెప్పుడు నీకెఁగూడియుంద మిద్దఱము సొం
పొప్పనని వారు పాళియ
మప్పుడె మెత్తివడి నరిగి రమరావతికిన్.

వ. ఇవ్విధంబున రంభోర్వశులు తమ యఖర్వగర్వాంధకారంబు మునిలోకబాంధవు తేజఃప్రభావంబున దూరంబగుటయు నిర్విణ్ణహృదయలై సుపర్వరాజధానికిం జనిన యనంతరంబ యనంతశాంతగుణమణిఘనీభూత తపోధనుండగు నాఘనుం డచ్చటికి నాయచ్చరమచ్చెకంటులు వచ్చుట పోవుట లెఱుంగక యభంగధ్యాననిష్ఠాగరిష్ఠుండై చెలంగుచుండ.

సీ. సంచారమాచెంత నించుకంతయు లేమిఁ
జెదలుఁ బ్రుస్సలు నేల మొదలఁ దోడఁగ
జెదలుఁ బ్రుప్వలతనిఁ బొదుగ బుట్టలు వెట్టె
బుట్టఁగోపులలోనఁ బుట్టెఁ జెట్లు
చెట్లయందే ప్రవేశించి నాల్కలుఁ గోయు
పెనుబాములను దీఁగెలును బెనంగ
దీఁగెలంతంతట దిరిగి గూడులు గట్టె
గూడులలోనఁ బక్షులు సెలంగె
నంతరాంతరములయందు దంతిసింహ
శరభశార్దూలసింహంబు లిరవుకొనియె
పార్థివకళేబరంబు లోపల వెలుంగు
నంతరాత్మయుఁబలె నతఁడందునుండె.

క. అటసప్తర్షులు హిమవ
త్కటకవినోదములుచూచి క్రమ్మరి తమసా
తటమునకువచ్చి యచ్చట
నటు నిటుఁ గనుఁగొనుచు వారలందఱుఁదమలోన్.

ఉ. శుష్కవనంబు మున్ను చటఁ జూడఁగ నేఁడిదె వింతవింతలై
పుష్కరిణీరసోర్మి కణపూరిత శీతలవాతపోతకా
విష్కృతపుష్పనిష్పతద వేల రసాల మరందకందళీ
పుష్కరనిర్ఝరు ల్మిగులఁ బొల్పువహించె మనోహరంబులై.

సీ. ముందుకోరెంద లేకందు మొంనును నెందు
నల్లనేరెడు లెన్ని యల్లుకొనియె
మున్ను సన్నపుటీఁత ముద్దలీ చెంగట
సురపొన్నగుంపము ల్జొంపమయ్యెఁ
దొల్లియంతటుదంతె దొంతరలీ చెంతఁ
దీయమామిడు లెన్ని మూయవెరగ
ము·ను ముమ్మురపుఁదుమ్మె మానుగంపులీవంక
బలు వేరుపనసలు బలిసెఁజాల

నాఱుఋతువులఁ బుష్పంబు లలరుచున్న
వెంతవింతలు మనము నేడేదులయ్యె
హిమగిరికిఁబోయి యింతలో నెన్నిపుట్టె
దేశకాలవిశేషము ద్దెలియ వశమె.

సీ. పులుమేపులును మాని పులులవీపులు మెట్టి
గునిసియాడెను లేటి కొదమలిచట
దమిసీలకంఠకంఠముల హారంబుల
బాగుజూపెడుఁ గోడెనాగులీడ

సింగంపుఁగూనలఁ జేపట్టి యాడుచు
నున్నవి యేనుంగు గున్నలింక
ముంగిసల్ మూషికంబులు నొక్కదిక్కునఁ
జెల్లాడుచున్నవి చెంతఁగూడి
యింతవింతదలంపఁగ శాంతిమంతు
డెవ్వఁడో యొక్కయోగి యీయెడవసించి
తపముసలిపెడుఁ గాఁబోలు నిపుడుగాక
యుండునే యిట్టి మహిమంబు లొనరుటెల్ల.

వ. అని పొగడుచు మఱియును.

క. ఇక్కడఁగాడే మనలన్
ముక్కలపఱిచె నొక్కబోయ ముడు మునుకొని వా
డెక్కడఁడబోయెనో యిపుడన
గ్రక్కునవాకాశవాణి గంభీరముగన్.

క. ఈవల్మీకంబున నదె
శ్రీవల్లభుభక్తసులభు సీతారమణున్
భావింపుచు నున్నాఁడనఁ
గా వారలరాక యెఱిఁగి గ్రక్కున నతఁడున్.

శా. ఆవల్మీకముఁజించికొంచు నుదయాహార్యాంతరాళంబు నం
దావిర్భావమునొందు భాస్కరునిచాయన్ శోణశోణప్రభా
వ్యావల్గత్కిరణంబులో యన జటాప్రాంతంబు శోభిల్లఁగా
వేవేగంజనుదెంచి యమ్మునుల సేవించెన్ బ్రియంబిచ్చఁగన్.

క. సేవించి నిలిచి యంజలిఁ
గావించి మునీంద్రులార ! కరుణాంబుధులా
రా ! వినుఁ డీ మీావలనం
బావనభావంబుఁ జెంది మాన్యుఁడనైతిన్.

వ. అనినవిని యమ్మునీంద్రులందఱు నానందంబున.

క. ఈజటలీ కృష్ణాజిన
మీాజపమాలికయు శాంతిమెయిఁగలిగెనో
యీాజగదాంగకు నోహో
శ్రీజానిస్మరణమహిమ సెప్ప నశక్యమే.

సీ. ధరనెన్ని పుణ్యతీర్థములైనఁ గలుగ నీ
రామనామము సరిరావు దలఁప
నిర్మలస్థితిమించు నిధులెల్లఁగలుగ నీ
రామనామము సరిరావు దలఁప
నానావిధములైన దానము ల్గలుగ నీ
రామనామముసరిరావు దలఁప
నతిశయంబుగమహావ్రతములుగలుగ నీ
రామనామము సరిరావు దలఁప
రామనామంబె సారంబురామభద్ర
రామచంద్ర రఘూద్వహ రామయనుచు
ననయము జపింపవలయు దక్కినవియేల
రామనామంబునకు సరిరావుదలఁప.

వ. ఇవియంతయును రామనామస్మరణంబకాని వేఱొక్కటిగాదెట్టి పాపిష్ఠుండైన నిష్ఠాగరిష్ఠుండగుచు శ్రీరామస్మరణంబుసేయ సకలభోగంబులు గలుగుట నిస్సంశయంబు. వీఁడు ప్రహ్లాద నారద పరాశర వ్యాస పుండరీకాదులలో నొక్కఁడుగాని సామాన్యుండుగాఁడని సన్నుతింపుచు సముచితంబుగా వాని వీడుకొని యథేచ్ఛం జనిరి. వాఁడు నవ్వల్మీకంబునం బుట్టుట కతన వాల్మీకియను నామధేయంబు వహించె నవ్వాల్మీకి మహాముని యనంతకంతకంతరంగంబున నుప్పొంగు భక్తి విశేషంబున నిరంతర జపశీలుండై యుండ నతని చిత్తశుద్ధికి నలరి రామభద్రుం డొక్కనాఁ డతని యగ్రభాగంబున.

సీ. కోర్కులపంటగల్గుటకు ప్రాలెడుమేఘ
మనఁగ వినీలకాయంబుమెఱయ
ప్రణతులకాయువుల్ వ్రాయు తూలికనాఁగ
వాలిక తూపొక్కకేల నమర
హస్తదైర్ఘ్యముచూపు ననువునఁ గాంచన
ఘనకార్ముకము భుజాగ్రమున వ్రేల
నీలాద్రిమేఖల నిండారునీరెండ
చెలువునబంగారు వలువదనర
మహితకరములజిగిగండమండలమున
దాండవముజూప నుద్దండపుండరీక
పత్రరుచిహిండనంబులఁ బోలువెట్టు
కాలుఁగన్నులఁ గృపయొల్కఁగానుపించె.

సీ. పసిడిగింటెంపుమాప్పటికళ్ళ లోహో హో
కమ్మకస్తూరితిలకమ్ము భళిర
శరచాపములువూను సరవియమ్మమ్మ మా
ణిక్యకోటీరంబు నీటువాపు
నిగనిగమనుచిన్న నగవులాహా మణి
మకరకుండలముల మహిమ మేలు
తళుకుగుంకుమపు గందపుబూతయయ్యారె
హారవల్లికల యొయ్యారమౌర

మించననెంచఁదగులీలఁ గాంచి మంచి
మించిజిగిమించు నెమ్మేని మెలతగూడి
చల్లఁజూపులఁ గరుణారసంబుఁ జల్లు
జల్లుచును నిల్చె శ్రీరామచంద్రుఁడెదుట.

గీ. జానకీజానియిట్లు సాక్షాత్కరింప
నత్తపస్వియు నానంద మత్తచిత్త
వృత్తుఁడగుచును నతులుగావించి లేచి,
కరయుగంబు నిటాలభాగమునఁ జేర్చి.

సీ. జయదశరథ సుధాజలధిరాకాచంద్ర
జయతాటకాభిధా చటులబాణ
జయగాధినందన సవనరక్షణదక్ష
జయసుబాహూత్సాహ శమనబాహా

జయగౌతమాంగనాశాపవిమోచన
జయకృతానంగ జిచ్చాపభంగ
జయభూమికన్యకోపయమ లీలాలోల
జయవాలి నిగ్రహాశ్చర్యశౌర్య

జయపయోనిధిలంఘన జాంఘికబల
జయదశాననఖండనచండకాండ
జయవిభీషణపోషణాసక్తచిత్త
జయయయోధ్యాభిషిక్త శ్రీ జనకజాప్త.

ఉ. శ్రీరఘురామ భానుకులశేఖర మీపదపద్మసేవ మం
దారనగంబు ముంగిట నిధానము తంగెటిజున్ను కొంగుబం
గారము వేల్పుమానికము కైవసమైనధనంబు చేరువా
మేరువు కామధేనువు సమీపసుధాంబుధి మాకు నెప్పుడున్.

సీ. కట్టఁగాలువకదా కల్లోలినీభర్త
చెఱకుఁబట్టెముగదా శివునిధనువు
కలువరేకులజోకగద సప్తసాలముల్
పలుకుటీగిమెఁగదా తలఁప లంక
కందుకంబుగదయ్యె దుందుభికాయంబు
కాలఁగీరినబొమ్మగద యహల్య
సూటికంబముగదా సురవైరిదేహంబు
పెట్టుఁజెట్టుంగదా విభీషణుండు

తెరువునకు నడ్డమౌ లేఁతతీవఁ ద్రుంచు
కరణిఁగద కబంధభూజవిఖండనంబు
నీకు నీమహత్త్వంబు వర్ణింపఁదరమె
ప్రకటగుణసాంద్ర దశరథ రామచంద్ర.

వ. అని సన్నుతించిన సంతసించి రామభద్రుండు నిర్నిద్ర తాత్ప ర్యంబున నమ్మునివర్యుని మస్తకంబున హస్తస్పర్శనంబు గావించి యోమునికులతిలకా! నీభక్తికి మెచ్చితి. మచ్చరి తంబు భవ్యంబగు కావ్యంబుగా నొనరింపుమని యానతిచ్చి చనియె. అంత నవ్వాల్మీకిమహామునియు నాజానకీవల్లభుని భక్తి సులభత్వంబుఁ గొనియాడి సుధాబిందుబంధురతరంగ రింగణాధార ధౌరంధరవినూత్న మృదులపద సందర్భరస గర్భితార్థ చమత్కార పారాయణంబుగా రామాయణంబు వక్కాణించె నట్టి రామాయణంబు సకలలోక ప్రసిద్ధంబగు టెఱుంగుదు రే కదా! ఇంక నేమివినవలతురని యడిగిన నమ్ముని పుంగవులందఱు నప్పర్వతుం బూజించి నీవలననిట్టి పుణ్యకథ వినంగలిగె, కృతార్థులమైతిమని సన్నుతించి వెండి యుఁ దత్కథావిశేషంబు ప్రశంసించుచుండిరంత.

క. శ్రీకరమై తగు నవ్వా
ల్మీకి చరిత్రంబు భక్తిమెఱయఁగ నెపుడున్
చేకొని జదివిన వినినన్
చేకురువారల కభీష్ట చిరశోభనముల్.

—గద్య.—

ఇది శ్రీరామచంద్రసాంద్ర కరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వతవిశేష, నిరర్గళ వాగ్వైభవాశేష సరససాహిత్యకళాభోజ, సత్యసంభాషిత ముఖాంభోజ, సకలసామ్రాజ్యధౌరేయ, నిత్యవితీర్ణ ధారారాధేయ, నిరతానారతాన్నసత్రసంతోషితప్రతిదివస పంచాశత్సహస్రభూసుర, బహువారావర్తిత మహాదానవైభవావర్తిత కీర్తిభాసుర, నిజనామాంకితాకలంకవస్తుసమగ్ర బహుళాగ్రహారభూషిత, చోళధారామండలనిఖిలభోగవిభవనిర్జితాఖండల. సాధితసముద్రాంతరద్వీప పరనృపాలసంస్తుతప్రతాప, నేపాళభూపాలస్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయధౌరంధర్య, రామసేతు శ్రీరంగవిజయరాఘవపురకుంభకోణాది దివ్యస్థలప్రతిష్ఠాపిత రామభద్రసర్వజనసంభావిత, గాంభీర్యముద్రావినిర్జితసముద్ర సదాశ్రితభరణ దీక్షాదక్ష దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజసన్నుతా సాధారణశౌర్య దిగంతప్రసిద్ధతరౌదార్య సుజ్ఞానజనకసతతసంసేవితజనకపోషితవిద్వత్కవియూథ, భువనశోభితగుణసనాథ, బలవత్పరిపంథిగృహీత సామంతమహీకాంత విమోచనశ్లాఘనీయ బాహాబల, మూర్తిమాంబాగర్భశుక్తిముక్తాఫల, చినచెవ్వనృపాలపుత్త్ర, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజితకుసుమసాయక సకలధర్మసంధాయక, రఘునాథనాయకప్రణీతంబైన వాల్మీకిచరిత్రంబను మహాప్రబంధంబునందు

తృతీయాశ్వాసము.

---

# ఆంధ్ర విజ్ఞాన సమితి,

## విజయనగరము.

అధ్యక్షులు, కోశాధిపతులు :

రావుసాహేబు వేపకొమ్మ జి. సుబ్బయ్యపంతులుగారు,

బి. ఇ. సి. ఇ యమ్. ఐ. ఇ.,

చీఫ్ ఇంజనీయరు, శ్రీ విజయనగరం ఎస్టేటు.

ఉపాధ్యక్షులు :—అడిదము రామారావు పంతులుగారు,

రిటైర్డు సీనియరు తెలుగు పండితులు, శ్రీ మహారాజావారి కాలేజి.

కార్యదర్శి:—గంటి సూర్యనారాయణశాస్త్రి.

లేఖకుడు:—భళ్ళమూడి నరసింహశాస్త్రి. బి. టి. పి.

కృతన్సమాలోచనసమితి.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, శాస్త్రరత్నాకర,

శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రిగారు.

శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామిగారు, యమ్. ఏ.

ప్రిన్సిపాల్ శ్రీ మహారాజావారి సంస్కృతకళాశాల.

శ్రీమాన్ టి. నరసింహాచార్యులుగారు, ఎమ్. ఏ. యల్. టి.

లెక్చరర్ భాషాశాఖ శ్రీ మహారాజావారి కాలేజి.

డాక్టరు, బుర్రా శేషగిరిరావు పంతులుగారు,

ఎమ్. ఏ., పి. హెచ్. డి.

ఆకుండి వేంకటశాస్త్రిగారు,

పండితులు, శ్రీ మహారాజావారి సంస్కృతకళాశాల,

ఆంధ్రా యూనివర్సిటీ సెనెటు, ఎకడిమిక్కౌన్సిలు, బోర్డాఫ్‌స్టడీస్ సభ్యులు.

# నిబంధనలు.

పోషకులు :- సంవత్సరమునకు 10. రూపాయిలు తక్కువగాకుండ నిచ్చువారు యీ సమితికి పోషకులుగ పరిగణింపబడుదురు. సమితినుండి వెలువడిన గ్రంథములన్నియు వినామూల్యముగ పొందగలరు.

చందాదారులు :- సంవత్సరమునకు 4. రూపాయిలు ముందుగా నిచ్చువారు చందాదారులుగ నుండగలరు. సమితివారే తపాలాఖర్చులను భరించి గ్రంథముల నందజేయుదురు.

చందానిచ్చువారు తప్పక రశీదు పొందవలెను. చందా సొమ్ము అధ్యక్షుని పేరిట పంపవలెను. గ్రంథములు వి. పి. గా పంపబడవు.

చందాదారులుగాజేరని యితరులకు తపాలా ఖర్చులుగాక గ్రంథమొక రూపాయికి లభించగలదు.

## విక్రమ వత్సరమున ప్రకటించిన గ్రంథములు.

1. రాధామాధవ సంవాదము :- కలిదిండ్ల వేంకటపతిమహాకవి. ఇందు రాధామాధవుల సరససంభాషణలు, ప్రేమ, చక్కగ వర్ణింపబడినవి. వెల ౧-౦-౦

2. విస్మృత కళింగాంధ్రకవులు :- శ్రీ అడిదము రామారావుపంతులు గారు. ఇందు 15 గురు విస్మృత కళింగాంధ్రకవుల చరిత్రలు గలవు. వెల ౧-౦-౦

3. వాల్మీకి చరిత్రము :- తంజావూరు రఘునాథభూపాలుడు. ఆదికవి, వాల్మీకిమహాముని చరిత్రమిందు చక్కగ వర్ణింపబడినది. వెల ౧-౦-౦

4. గర్గసంహిత చరిత్ర :- శ్రీ వేపకొమ్మ, గురువేంకట సుబ్బార్యా, శ్రీమతి ఆదిలక్ష్మమ్మగార్లు. ఇందు గార్హస్థ్య ధర్మములు, భక్తి, కర్మ, యోగప్రకారములు పంచాక్షరీ మంత్రప్రభావము మున్నగునవి మిక్కిలి చక్కగ నిరూపింప బడినవి. వెల ౧-౦-౦

5. రుక్మవతీ పరిణయము :- రేకపల్లి సోమనాథకవిప్రణీతము. పాండిత్యమునకు, రసగుంభనకు, చమత్కారమునకు శృంగాటకము. వెల ౧-౦-౦

# వృషవత్సర ప్రచురణములు.

6. కూర్మనాథకవి కృతులు - ప్రథమ భాగము.

(మృత్యుంజయవిలాసము) :- గోగులపాటి కూర్మనాథకవి కృతము. ఇందు పార్వతీ పరిణయకథ యక్షగానముగ వర్ణింపబడినది.

వెల ౧-౦-౦

7. కూర్మనాథకవి కృతులు - ద్వితీయభాగము.

ఇందు లక్ష్మీనారాయణ, సంవాదము (చోరసంవాదము) సుందరీమణి శతకము, సింహాద్రి నారసింహశతకములు గలవు. జాతీయతలు, జాను తెలుగు పదములను, రసోల్బణమునను కూర్మనాథుడు కూర్మావతారమే.

వెల ౧-౦-౦

8. ద్వైతాద్వైత దర్శనములు :- మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, శాస్త్రరత్నాకర, శ్రీ తాతా సుబ్బారాయ శాస్త్రులవారిచే ఆంధ్రీకరింపబడినవి. అద్వైతము, ద్వైతము యిందు సులభశైలిని గలవు.

వెల ౧-౦-౦

9. బాలగోపాలవిలాసము :- ఒడ్డియకవి ప్రణీతము. ఇందు నీలాసుందరీ పరిణయము పద్య రూపముగ నీప్రాచీనకవి రచించెను.

వెల ౧-౦-౦

10. తత్వసంగ్రహ రామాయణము :-(బాలకాండ ప్రథమభాగము అకుండి వేంకటకవి ప్రణీతము. రామాయణమందలి తత్వార్థ మిందు విశదీకరింపబడినది. వెల ౧-౦-౦

11. తత్వసంగ్రహరామాయణము :-(బాలకాండ ద్వితీయభాగము అకుండి వేంకట కవి. వెల ౧-౦-౦

అధ్యక్షులు,
ఆంధ్ర విజ్ఞానసమితి,
విజయనగరము.